# అథ ద్వి పంచాశత్తమాeôధ్యాయః

## పెండ్లి వారి భోజనములు

బ్రహ్మోవాచ|

అథ శైలవరస్తాత హిమవాన్ భాగ్యసత్తమః | ప్రాంగణం రచయామాస భోజనార్థం

విచక్షణః || 1

మార్జనం లేపనం సమ్యక్కారయామాస తస్య సః | స సుగంధైరలంచక్రే నానావస్తు భిరాదరాత్ || 2

అథ శైల స్సురాన్ సర్వాన్ అన్యా నపి చ సేశ్వరాన్ | భోజనా యాహ్వాయామాస పుత్రైశ్శైలైః పరైరపి || 3

శైలాహ్వానమథా కర్ణ్య స ప్ర భుస్సా చ్యుతో మునే | సర్వైస్సురాదిభిస్తత్ర భోజనాయ య¸° ముదా || 4

బ్రహ్మఇట్లు పలికెను-

కుమారా! అపుడు మహాభాగ్యవంతుడు, పర్వతరాజు, విద్వాంసుడునగు హిమవంతుడు భోజనము కొరకు ప్రాంగణమును ఏర్పాటు చేసెను (1). ఆయన దానిని తుడిపించి, చక్కగా సుగంధ ద్రవ్యములను చల్లించి, అనేక వస్తువులచే శ్రద్ధగా అలంకరింపజేసెను (2). అపుడు హిమవంతుడు దేవలనందరినీ, ఇతరులను, ఈశ్వరుని, తన కుమారులగు పర్వతుల చేత, మరియు ఇతరులచేత ఆహ్వానింప జేసెను (3). ఓ మునీ! ఆ ప్రభుడు పర్వతుని ఆహ్వానమును విని అచ్యుతునితో గూడి, దేవతలు మొదలగు వారందరితో కలిసి ఆనందముతో ఆచటకు భోజనము కొరకై వెళ్లెను (4).

గిరిః ప్రభుం చ సర్వాంస్తాన్ సుసత్కృత్య యథావిధి |
ముదోపవేశయామాస సత్పీఠేషు గృహాంతరే || 5

నానా సుభోజ్య వస్తూని పరివిష్య చ తత్పునః |
సాంజలిర్భోజనాయాజ్ఞాం చక్రే విజ్ఞప్తి మానతః || 6

అథ సమ్మానితాస్తత్ర దేవా విష్ణుపురోగమా ః | సదాశివం పురస్కృత్య బుభుజుస్సకలాశ్చ తే || 7

తదా సర్వే హి మిలితా ఐకపద్యేన సర్వశః | పంక్తి భూతాశ్చ బుభుజుర్విహసంతః పృథక్ పృథక్ || 8

హిమవంతుడు శివుని ఇతరులనందరిని యథావిధిగా మంచిగా సత్కరించి ఇంటి లోపల మంచి పీటలపై ఆనందముతో కూర్చుండబెట్టెను (5). అనేక మధుర పదార్థములను వడ్డించిన తరువాత ఆయన సమ్మానపూర్వకముగా చేతులు జోడించి భోజనమునకు అనుమతినిచ్చెను (6). అపుడచట సన్మానింపబడిన విష్ణువు మొదలగు దేవతలందరు సదాశివుని ముందిడుకొని భోజనము చేసిరి (7). అపుడు వారందరు ఒకే సారి అంతటా వరుసలో వేర్వేరుగా కూర్చుండి నవ్వుతూ భుజించిరి (8).

నంది భృంగి వీరభద్ర వీరభద్ర గణాః పృథక్ | బుభుజుస్తే మహాభాగాః కుతూహల సమన్వితాః || 9

దేవాస్సేంద్రా లోకపాలా నానాశోభా సమన్వితాః | బుభుజుస్తే మహాభాగా నానాహాస్యరసై#ఃస్సహ || 10

సర్వే చ మునయో విప్రా భృగ్వాద్యా ఋషయస్తథా | బుభుజుః ప్రీతితస్సర్వే పృథక్ పంక్తి గతాస్తదా || 11

తథా చండీ గణాస్సర్వే బుభుజుః కృతభాజనాః | కుతూహలం ప్రకుర్వంతో నానాహాస్యకరా ముదా || 12

మహాత్ములగు నంది, భృంగి, వీర భద్రుడు, వారి గణములు కుతూహలముతో గూడిన వారై వేర్వేరుగా భుజించిరి (9). ఇంద్రాది దేవతలు, మహాత్ములగు లోకపాలకులు వివిధ శోభలతో గూడిన వారై అనేక హాస్యోక్తులను పలుకుతూ భుజించిరి (10). మునులు, విప్రులు, భృగువు మొదలగు ఋషులు అందరు వేర్వేరు పంక్తులలో కూర్చుండి ప్రీతితో భుజించిరి (11). చండీ గణములందరూ కుతూహలమునకు కలిగించువారై అనేక హాస్యవచనములను పలుకుతూ ఆనందముతో పళ్లెరముల యందు భుజించిరి (12).

ఏవం తే భుక్త వంత శ్చాచమ్య సర్వే ముదాన్వితాః | విశ్రామార్థం గతాః ప్రీత్యా విష్ణ్వాద్యాస్స్వం స్వమాశ్రమమ్ || 13

మేనాజ్ఞయా స్త్రియ స్సాధ్వ్యశ్శివం సంప్రార్థ్య భక్తితః | గేహే నివాసయామాసుర్వాసాఖ్యే పరమోత్సవే || 14

రత్న సింహాసనే శంభుర్మేనాదత్తే మనో హరే | సన్నిధాయ ముదా యుక్తో దదృశే వాసమందిరమ్ || 15

రత్న ప్రదీపశతకై ర్జ్వలద్భి ర్జ్వలితం శ్రియా | రత్న పాత్ర ఘటాకీర్ణం ముక్తామణి విరాజితమ్ || 16

విష్ణువు మొదలగు వారందరు ఈ తీరున ఆనందముగా భుజించి నీటిని త్రాగి ప్రీతితో విశ్రమించుట కొరకై తమ తమ నివాసములకు వెళ్లిరి (13). మేన యొక్క ఆజ్ఞచే సాధ్వీమణులు శివుని భక్తితో ప్రార్థించి పరమోత్సవముతో కూడియున్న గృహమునందు నివసింప జేసిరి (14). శంభుడు మేనచే ఈయబడిన మనోహరమగు రత్న సింహాసనమునందు కూర్చుండి ఆనందముతో వాసగృహమును పరికించెను (15). మెరిసి పోయే అనేక రత్న దీపములతో శోభిల్లునది, రత్నములు పొదిగిన పాత్రలతో ఘటములతో కూడియున్నది, ముత్యములతో మణులతో విరాజిల్లునది అగు మందిరమును చూచెను (16).

రత్నదర్పణశోభాఢ్యం మండితం శ్వేత చామరైః | ముక్తామణి సుమాలాభి ర్వేష్టితం పరమర్ధి మత్ || 17

అనూపమం మహాదివ్యం విచిత్రం సుమనోహరమ్ | చిత్తాహ్లాదకరం నానారచనా రచిత స్థలమ్ || 18

శివదత్త పరస్తై#్యవ ప్రభావమతులం పరమ్ | దర్శయంతం సముల్లాసి శివలోకాభిధానకమ్ || 19

నానా సుగంధసద్ద్రవ్యై ర్వాసితం సుప్రకాశకమ్ | చందనా గురు సంయుక్తం పుష్పశయ్యాసమన్వితమ్ || 20

రత్నపుటద్దముల శోభతో విరాజిల్లునది, తెల్లని చామరములతో అలంకరింపబడినది, ముత్యముల మణుల మాలలతో అలంకరింపబడినది, మహాసంపదలతో కూడియున్నది (17), సాటిలేనిది, మహా దివ్యమైనది, రంగు రంగులది, మిక్కిలి మనోహరమైనది, చిత్తమునకు ఆహ్లాదమును కలిగించునది, నేలపై వివిధ రచనల శోభ గలది (18), శివుడు ఇచ్చిన వర ప్రభావము వలననే నిర్మాణమైనది, శివలోకమను నామధేయము గలది (19), అనేక సుగంధ ద్రవ్యములచే పరిమిళ భరతమైనది, చందనము, అగరులతో కూడినది, పుష్పశయ్యలతో కూడియున్నది అగు గృహమును చూచెను (20).

నానాచిత్ర విచిత్రాఢ్యం నిర్మితం విశ్వకర్మణా | రత్నేంద్ర సారరచితై రాచితం హారకై ర్వరైః || 21

కుత్ర చిత్సుర నిర్మాణం వైకుంఠం సుమనోహరమ్ | కుత్రచిచ్చ బ్రహ్మలోకం లోకపాలపురం క్వచిత్ || 22

కైలాసం కుత్రచిద్రమ్యం కుత్రచిచ్చక్రమందిరమ్ | కుత్రచిచ్చవలోకం చ సర్వోపరి విరాజితమ్ || 23

ఏతాదృశ గృహం సర్వ దృష్ట్వాశ్చర్య మహేశ్వరః | ప్రశంసన్ హిమశైలేశం పరితుష్టో బభూవ హ || 24

అనేక చిత్ర విచిత్రములతో ప్రకాశించునది, విశ్వకర్మచే నిర్మింపబడినది, శ్రేష్ఠ రత్నములతో తయారైన శ్రేష్ఠ హారములతో అలంకరింపబడినది (21) అగు గృహమును చూచెను. ఆ గృహములో ఒకచోట దేవతలచే నిర్మింపబడిన మిక్కిలి అందమగు వైకుంఠము, మరియు బ్రహ్మలోకము, మరియొక చోట లోకపాలకుల నగరము (22), ఒకచోట రమ్యమగు కైలాసము, మరియొక చోట ఇంద్ర భవనము, వీటన్నిటిపై విరాజల్లే శివలోకము రచింపబడి యుండెను (23). అందరిచే ఆశ్చర్యముతో చూడబడే ఇట్టి గృహమును చూచి మహేశ్వరుడు హిమవంతుని ప్రశంసించి సంతుష్టుడాయెను (24).

తత్రాతిరమణీయే చ రత్న పర్యంక ఉత్తమే | అశయిష్ట ముదా యుక్తో లీలయా పరమేశ్వరః || 25

హిమాచలశ్చ స్వభ్రాతౄన్ భోజయామాస కృత్స్నశః | సర్వానన్యాంశ్చ సుప్రీత్యా శేషకృత్యం చకార హ || 26

ఏవం కుర్వతి శైలేశే స్వపతి ప్రేష్ఠ ఈశ్వరే | వ్యతీతా రజనీ సర్వా ప్రాతః కాలో బభూవ హ || 27

అథ ప్రభాతకాలే చ ధృత్యుత్సాహ పరాయణః | నానా ప్రకారవాద్యాని వాదయాంచక్రిరే జనాః || 28

ఆ భవనములో ఉత్తమము అతిరమణీయము అగు రత్నపర్యంకముపై పరమేశ్వరుడు ఆనందముతో కూడిన వాడై లీలగా శయనించెను (25). హిమవంతుడు తన సోదరులను, ఇతరులను చక్కని మృష్టాన్నముతో ఆనందింపజేసి ఇతర కృత్యములను కూడ చేసెను (26). హిమవంతుడు ఇట్లు కార్యమగ్నుడై యుండగా, ప్రియతముడగు ఈశ్వరుడు నిద్రించుచుండగా, రాత్రి గడచిపోయి,

ప్రాతఃకాలమయ్యేను (27). అపుడా ప్రభాత సమయములో జనులు ధైర్యోత్సాహములతో నిండినవారై అనేక రకముల వాద్యములను మ్రోయించిరి (28).

సర్వే సురాస్సముత్తస్థుర్విష్ణ్వా ద్యాస్సముదాన్వితాః | స్వేష్టం సంస్మృత్య దేవేశం సజ్జీ భూతాస్ససంభ్రమాః || 29

స్వ వాహనాని సజ్జాని కైలాసం గంతు ముత్సుకాః | కృత్వా సంప్రేషయామాసుర్ధర్మం శివసమీపతః || 30

వాసగేహమథాగత్య ధర్మో నారాయణాజ్ఞయా | ఉవాచ శంకరం యోగీ యోగీశం సమయోచితమ్ || 31

విష్ణువు మొదలగు దేవతలందరు ఆనందముతో నిద్రలేచి తమ ఇష్టదైవమగు ఈశ్వరుని స్మరించి తొందరగా సంసిద్ధులైరి (29). వారు కైలాసమునకు వెళ్లుటకై ఉత్సుకత గలవారై తమ వాహనములను సిద్ధము చేసుకొని ధర్ముని శివుని వద్దకు పంపిరి (30). యోగి యగు ధర్ముడు అపుడు వాసగృహమునకు వచ్చి నారాయణుని ఆజ్ఞచే యోగిశ్రేష్ఠుడగు శివునితో సమయానురూపముగా నిట్లు పలికెను (31).

ధర్మ ఉవాచ |

ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రం తే భవ నః ప్రమథాధిప | జనావాసం సమాగచ్ఛ కృతార్థాన్ కురు తత్ర తాన్ || 32

ధర్ముడిట్లు పలికెను-

ఓ ప్రమథ పతీ! లెమ్ము, లెమ్ము, నీకు మంగళమగుగాక! మాకు మంగళములనిమ్ము. జనుల నివాసము వద్దకు రమ్ము. ఆచట వారిని కృతార్థులను చేయుము (32).

బ్రహ్మోవాచ|

ఇతి ధర్మ వచశ్ర్శుత్వా విజహాస మహేశ్వరః | దదర్శ కృపయా దృష్ట్వా తల్పముజ్ఝాం చకార హ || 33

ఉవాచ విహసన్ ధర్మ త్వమగ్రే గచ్ఛ తత్ర హ |అహమప్యాగమిష్యామి ద్రుతమేవ న సంశయః || 34

ఇత్యుక్త శ్శంకరేణాథ జనావాసం జగామ సః | స్వయం గంతుమానా ఆసీత్తత్ర శంభురపి ప్రభుః || 35

తద్ జ్ఞాత్వాస్త్రీ గణ సోऽసౌ తత్రాగచ్ఛన్మహోత్సవః | చక్రే మంగలగానం హి పశ్యన్ శంభు పదద్వయమ్ || 36

బ్రహ్మ ఇట్లు పలికెను-

ధర్ముని ఈ మాటలను విని మహేశ్వరుడు నవ్వి, దయా దృష్టితో చూచి శయ్యను వీడెను (33). 'ఓ ధర్మా! నీవు ముందు అచటకు వెళ్లుము. నేను కూడా శీఘ్రమే రాగలను. సందేహము వలదు' అని ఆయన నవ్వి పలికెను (34). శంకరుడిట్లు పలుకగా ఆతడు జనుల నివాసమునకు వెళ్లెను. శంభు ప్రభుడు కూడా అచటకు స్వయముగా వెళ్లవలెనని తలంచెను (35). ఆ విషయము తెలిసి స్త్రీలందరు అచటకు గొప్ప ఉత్సాహముతో వచ్చిరి. వారు శంభుని పాద ద్వయమును చూచుచూ మంగళ గానములను పాడిరి (36).

అథ శంభుర్భవాచారీ ప్రాతః కృత్యం విధాయ చ | మేనా మామంత్ర్య కుధ్రం చ జనావాసం జగామ సః || 37

మహోత్సవస్తదా చాసీ ద్వేదధ్వనిరభూన్మునే | వాద్యాని వాదయామాసు ర్జనాశ్చాతుర్విధాని చ || 38

శంభురాగత్య స్వస్థానం వవందే చ మునీంస్తదా | హరిం చ మాం భవాచారాత్ వందితోऽభూత్సురాదిభిః || 39

జయశబ్దో బభూవాథ నమశ్శబ్దస్తథైవ చ | వేదధ్వనిశ్చ శుభదో మహాకోలాహలోऽభవత్ || 40

ఇతి శ్రీ శివ మహాపురాణ    రుద్ర సంహితాయాం పార్వతీ ఖండే వరవర్గ భోజన శివశయన వర్ణనం నామ ద్విపంచాశత్తమోeôధ్యాయః (52).

అపుడు శంభుడు లోకాచారమునను సరించి ప్రాతః కృత్యములను పూర్తి చేసుకొని మేనా హిమవంతుల అనుమతిని తీసుకొని జనావాసమునకు వెళ్లెను (37). ఓ మునీ! అపుడు మహోత్సవమారంభమాయెను. వేదధ్వని మొదలాయెను. జనులు నాల్గు విధముల వాద్యములను ప్రయోగించిరి (38). శంభుడు అపుడు తన స్థానమునకు వచ్చి లోకాచారముననుసరించి మునులను, విష్ణువును, నన్ను నమస్కరించెను. దేవతలు మొదలగు వారు ఆయనకు నమస్కరించిరి (39). తరువాత జయధ్వానములు, నమశ్శబ్దములు, శుభకరమగు వేదధ్వని కలిసి పెద్ద కోలాహలము ప్రవర్తిల్లెను (40).

శ్రీ శివ మహాపురాణములోని రుద్రసంహితయందు పార్వతీఖండలో పెళ్లివారి భోజనమును వర్ణించే ఏబది రెండవ అధ్యాయము ముగిసినది (52).